## ప్రకటన

చిత్తూరుజిల్లాలోని కాళహస్తి యందు మా ఆంధ్ర దైనిక, సచిత్ర వార, భారతి మాస పత్రికలను వారి స్వంత బాధ్యతపైవిక్రయించుటకు శ్రీ పి. రంగయ్యనాయుడు గారిని 23-9-47 నుండి మా న్యూస్ వెండరుగా నియమించడమైనది.

మేనేజరు
ఆంధ్రపత్రిక, మదరాసు.



## గంటల పంచాంగం

సర్వజిత్ సం॥ భాద్రపద శు॥ నవమి 1947 సం॥ సెప్టెం॥23 మంగళవారం
మం॥ నవమి రా 2-52 పూషా 24-0 వర్జ్యం ఘ 2.14 ల 4-2 ఘ.
శు॥ దశమి సెప్టెం॥ 24 బుధవారం
బు॥ దశమి తె 5-21 పూ షా 7-29 వర్జ్యం ఘ 3-25 ల 5-13 ఘ.



ఆంధ్రపత్రిక
సర్వజిత్ సం॥ భాద్రపద శు॥ నవమి
మంగళవారము



## రాష్ట్రేతరాంధ్రుల హక్కుల రక్షణ

"ఆంధ్రరాష్ట్ర నిర్మాణము విషయమై రాజ్యాంగ పరిషత్తులో రెండు అభిప్రాయములు లేవు" అని డాక్టరు పట్టాభి సీతారామయ్యగారు మొన్న శనివారము ప్రకటించిరి. అదే ప్రకటనమున భారత ప్రభుత్వ చట్టమునకు అనుకరణగ తయారైన భారత స్వరాజ్యచట్టమున ఆంధ్రరాష్ట్రమునకు 'దగ్గరదారి' ఏర్పడినదని కూడ తెలిపిరి. రాష్ట్ర ఆర్థిక, సాంఘిక పరిస్థితుల సంస్కరించి చక్కబరచుటకే గాక, రాష్ట్రేతరాంధ్రులు ప్రస్తుత మనుభవించుచున్న బాధల తొలగించుటకును, సరిహద్దు నిర్ణయసంఘము ఎదుట ఆంధ్రుల హక్కుల సంరక్షించుటకును సత్వర రాష్ట్రనిర్మాణము అత్యంతావశ్యకముగ కన్పించుచున్నది. చెన్నపట్నములో ఆంధ్రబాలబాలికలకు గల విద్యాసౌకర్యములు పూర్తిగ అంతరించినవి. సమష్టిబాధ్యత, మంత్రులందరికి, ఉన్నప్పటికిని మద్రాసుమంత్రివర్గములోని తెనుగుమంత్రులు తమిళవిద్యామంత్రి వేసిన ఉత్తరువుల సాధారణ ప్రజలవలెనే శిరసావహింపవలసివచ్చినది. 'మాతృభాష'కు బదులు 'ప్రాంతీయభాష' అని సవరించుట ఆంధ్రుడు ప్రధానమంత్రిగ నున్న కాలమునసే జరిగియున్నందువల్ల ఇప్పటి మంత్రివర్గమందలి ఆంధ్రమంత్రులీ అన్యాయమును సరిచేయుట కళక్షులై యుండవచ్చును.



నగరసరిహద్దుల విస్తరణ విషయమున కూడ 'మద్రాసుమంత్రివర్గము' పక్షపాత విధానమునే అనుసరించుచున్నది. కాంగ్రెసు శాసనసభా పక్షమున తమసంఖ్యాబలమును ఆసరాగా చూచుకొని తమిళసభ్యులు తమ కనుకూలముగ నుండునట్లు ప్రభుత్వవిధానముల నిర్ణయించుచుండిరి. మదరాసు విషయమై తెలుగువారు తీర్మానములు చేయుచుండ, తమిళులు గోష్ఠ్యముగ తమ స్థానమును బలపరచుకొనుచుండిరి. ఇటీవల నగరమున జరిగిన చెంగల్పట్టుజిల్లా ఆంధ్రమహాసభ తీర్మానములు, మహాసభలో ప్రముఖుల ప్రసంగములు పట్టణములోనూ, పట్టణ పరిసరములలోను "తెనుగువాసన" లేకుండ చేయుటకు రాష్ట్ర ప్రభుత్వ మనుసరించుచున్న ప్రతీప విధానము వెల్లడియైనది.



ఒరిస్సా విభజన సందర్భమున ఆంధ్రులకు ప్రత్యేక రాష్ట్రమును, ప్రభుత్వాధికారము ఆంధ్రుల వశమున లేనందున సరిహద్దుల నిర్ణయ విషయమున ఆంధ్రుల కన్యాయము జరిగినది. ఒరిస్సా రాష్ట్రములో చేరిన ఆంధ్ర ప్రాంతములందలి తెనుగు వారిని ఒరిస్సాప్రధాని హరికృష్ణ మెహతబ్ గారు శాంతి విధ్వంసకులని నిందించి మందలింప సాహసింపగలిగిరి. ఆ ప్రాంతమున తెనుగువారు కాంగ్రెస్ సభ్యులను చేర్చుటకు ప్రయత్నింపగ ఒరిస్సా ప్రభుత్వము వారిని అరెస్టుచేయుట జరిగినది. తమిళ ప్రాబల్యము గల మద్రాసు మంత్రివర్గ మీ విషయమునకు కనీసము తన అధిక్షేపణనైనను తెలుపవలదు. ఆ ప్రాంత ఆంధ్రులీ సంఘటన విషయమై మద్రాసు మంత్రివర్గమునకు విజ్ఞప్తి కూడ చేసియుండిరి. మద్రాసు ప్రభుత్వ మిప్పటివరకు ఎట్టి చర్య తీసుకొనియుండలేదు.



ఒరిస్సా రాష్ట్రములో చేరిన ఆంధ్ర ప్రాంతములందలి ప్రజల ఇబ్బందులు నానాటికి అధికమగుచున్నవి. ఆమధ్య ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘమువారు ఒక సాహాయ్య రాయబారమును పంపిరి. ఇందువల్లకూడ ఏమి ప్రయోజనము కన్పించలేదు. అఖిలభారత కాంగ్రెస్ కమిటీవారు ఆంధ్రోత్కళసమస్యను విచారించుటకు శ్రీ శంకరరావుదేవ్ గారిని నియోగించిరి. ఇందువల్లకూడ ఏమియు జరుగలేదు. రెండు సంవత్సరముల క్రితము హరికృష్ణమెహతబ్ గారే డాక్టరు పట్టాభిగారితో కలసి సరిహద్దుప్రాంత ప్రజలకు విజ్ఞప్తి చేసియుండిరి. కాని ఆవిజ్ఞప్తి అంశములను ప్రధానియగుటతో విస్మరించినట్లు కన్పించుచున్నది. ఆచార్యరంగాగారు, ఒరిస్సాలోని ఆంధ్రులు అనేక బాధలకు లోనగుచుండిరని, మెహతబ్ గారు ఒక్క తెనుగు వారిని మందలించుట సమంజసము గాదని, ఒరిస్సా అధికారుల ముందు అదుపులో నుంచవలసి యున్నదని సూచించిరి. మెహతబ్ గారు ఈ సూచనల పాటించెదరని ఆశింప వీలుగాదు. అధికారయుతముగ వారికి చెప్పగల స్థితిలో ఆంధ్రులులేరు. కనుకనె వారు "ప్రత్యేకాంధ్రరాష్ట్రమును నిర్మింపవలెనని రాజ్యాంగ పరిషత్తు వారింకను నిర్ణయింపలేద"ని వికటముగ తమ ప్రకటనయందు తెలిపిరి. ఆంధ్రరాష్ట్ర మేర్పడిన గాని ఆంధ్రుల హక్కులు, సంస్కృతి, ప్రకృతిసంపద, సంరక్షణ సాధ్యముగాదు. ప్రత్యేక రాష్ట్ర సత్వరసంపాదనె లక్ష్యముగ పెట్టుకొని ఆంధ్రులందరు పనిచేయవలసియున్నది.



రాష్ట్రసంపాదన విషయమున ఆంధ్రనాయకులలో అభిప్రాయ భేదములు లేకపోవుటెగాక, అందరు ఏకాభిప్రాయులై యున్నట్లు రాష్ట్ర రాజకీయసభలో ప్రకాశంపంతులుగారు ప్రకటించియుండిరి. వారు వాస్తవమునె వెల్లడించియున్న సత్వర రాష్ట్రనిర్మాణము సాధ్యమనియె విశ్వసింపవచ్చును. కాని రాష్ట్రసంపాదన కనుసరింపవలసిన మార్గము విషయమున మధ్యస్థకాలములో జరుగవలసిన ఏర్పాటుల విషయమున భిన్నాభిప్రాయము లున్నట్లు గోచరించుచున్నది. ప్రస్తుత మనుసరింపవలసిన మార్గము డాక్టరు పట్టాభి సీతారామయ్యగారు సూచించినట్లు "ఆర్డర్ ఇన్ కౌన్సిల్" ద్వారా కేంద్రప్రభుత్వము రాష్ట్రమును ఏర్పాటు చేయుటకు, రాజ్యాంగ పరిషత్తు చే తీర్మానము చేయించుటకు ఆందోళన చేయవలసియున్నది. ఈ ద్విముఖ ఆందోళన జరిగినగాని స్థిరఫలితములు సంప్రాప్తముకాజాలవు. భాషారాష్ట్ర నిర్మాణమునకై పనిచేయుచున్న ఇతర ప్రాంతములవారలి స్వరాష్ట్రము కొరకు పోరాడుట ప్రయోజనకరముకాదు. అందువల్ల ఉద్యమము బలహీనమగుట మన ఆందోళన నిష్ప్రయోజనమగుట కూడ సంభవింపవచ్చును. ఆ ప్రమాదమును గుర్తించి వ్యవహరింపవలసియున్నది. ఈ లోపున సరిహద్దుప్రాంత ఆంధ్రుల సంరక్షణకు తగిన ఏర్పాట్లు చేయుట వసరము.



## మాతృభాషల ద్వారా వ్యవహార నిర్వహణం

### ఆంగ్లభాషాధిపత్యం పోవాలని గాంధీజీ హెచ్చరిక

అహమ్మదాబాదు, సెప్టెంబరు 21 : "ప్రభుత్వాలు ముందే జాగ్రత్త పడకపోతే హిందూస్థానీ స్థానాన్ని ఇంగ్లీషుభాష ఆక్రమించుకుంటుంది. అంటే ఇంగ్లీషు నిన్నటికీ అర్థం చేసుకోలేని అసంఖ్యాక భారత జనానీకాని కంతటికీ అంతమైన హానికలిగించక మన్నమాట. నిజానికి రాష్ట్ర ప్రభుత్వాలు తలచుకుంటే తమ తమ రాష్ట్రాలలో రాష్ట్ర భాషనూ, దేశమంతటికీ అంతర్రాష్ట్రభాషగా నాగరీలిపిలోగాని ఉర్దూలిపిలోగాని వ్రాయబడిన హిందూస్థానీని ఆచరణలో పెట్టవచ్చు" అని మహాత్మాగాంధీ నేటి హరిజన్ లో "జాగ్రత్త!" అనే శీర్షికతో ఒకవ్యాసం వ్రాశారు. అందులో ఇంకా ఇట్లా ఉన్నది:



"ఈపని చెయ్యకంలో ఒకరోజు ఆలస్యమైనా జాతికి సైజ్ఞానికంగా ఎతో నష్టం వస్తుంది. భగవదానుగ్రహంవల్ల భారతదేశంలో సర్వతోముఖంగా వికసించిన రాష్ట్రభాషల సన్నింటినీ పునర్నిర్మించడం ప్రథమంలో పూనుకోవలసిన ప్రధానకార్యం. మన న్యాయస్థానాల్లో, మన పాఠశాలల్లో ఇతర ప్రభుత్వ కార్యాలయాల్లో ఈ మార్పు తీసుకురావడానికి మరి కొంతకాలం ఆగాలనడం కేవలం సోమరితనం తప్ప మరొకటికాదు. బొంబై, మద్రాసువంటి బహుభాషా రాష్ట్రాలలో భాషాప్రాతిపదికపై పునర్విభజన జరిగేవరకు మొదట్లో కొన్ని కష్టాలు ఎదుర్కోవలసిరావచ్చు. అటువంటి రాష్ట్రాలలోకూడా ప్రజలు తమ భాష నుపయోగించుకోవడానికి తగుతవకాశం ఉన్నదని తెలుసుకునేటట్లు ప్రభుత్వ మేర్పాటుచేయవచ్చు. దేశానికంతటా జాతీయభాషగా కృషిగా నాగరీ లిపులలో వ్రాసే హిందూస్థానీ ఉండాలా, లేక నాగరిలో వ్రాసే హిందీయే ఉండాలా అన్న సమస్యను కూడా రాష్ట్రప్రభుత్వాలు ఆగవలసరంలేదు. ఈ సంస్కారం జరగడానికి ఏమాత్ర మాలస్యమైనా ఇంగ్లీషువచ్చి మార్పుని భారతజాతి కంతకూ తీరని అవమానంగా పరిణమిస్తుంది. రాష్ట్రాలలో రాష్ట్రభాషలు వ్యవహార భాషలయితే అంతర్రాష్ట్రభాషా దానంతటదే వస్తుంది. ఎవరో కొందరు బద్ధకస్తులకోసం అక్కరచెయ్యక కేంద్రప్రభుత్వము ముందే జాగ్రత్త పడ్డయితే కేంద్రంలో వ్యవహరించవలసినప్పుడు రాష్ట్రప్రభుత్వాలు ఇంగ్లీషును ఉపయోగించడానికి సాహసించలేవు. దేశపరిపాలనాధికారాన్ని బలవంతంగా ఆక్రమించుకున్న ఇంగ్లీషు అధ్యాక్రమణ కారణంగా విధంగా పంపించి దేశాన్ని ఆదేవిధంగా భారత విజ్ఞానాక్రమణ కారకమైన ఇంగ్లీషు భాషను కూడా పంపించివేయ్యాని నావావం. రాజకీయ వ్యాపారాది విషయాలలో అంతర్జాతీయ భాషగా అమూల్యమైన ఇంగ్లీషు భాషకున్న సహజ గౌరవం అలాగే ఉంటుంది.



### లియాకత్ అలీఖాన్

లాహోరు, సెప్టెంబరు 21: పాకిస్తాన్ ప్రధానామాత్యుడు లియాకత్ అలీఖాన్ నేపటిదినం కరాచీకి యిక్కడనుంచి విమానములో వెళతాడు. ఆయనతోపాటు బెంగాలు నాజీ ప్రధానమంత్రి సుహ్రావర్దీ యున్నా వెళ్లుతాడు.





## ఇండోనేసియా సమస్య పరిష్కారం

### వాన్‌మూక్ విశ్వాసం

ఆంస్టరుడాం, సెప్టెంబరు 21 : "అంతర్జాతీయ మధ్యవర్తిత్వమును నిర్లక్ష్యము చెయ్యకుండా, వివాదము పరిష్కరించగలమని నేను ఆశిస్తున్నాను. ఆ విషయమై మా దేశంలో సంపూర్ణ ఏకీభావం వున్నది" అని ఇండోనీషియా డచ్ గవర్నర్ జనరల్ డా. వాన్‌మూక్, ఇండోనీషియాకు విమానంలో వెళ్ళబోయేముందు అన్నాడు.

వివాదములను పరిష్కరించుకొనుటలో రిపబ్లికన్ ప్రభుత్వములకు తోడ్పడుటకు ఐక్యరాజ్య సమితి ఒక సంఘమును నియమించిన సందర్భములో తన ప్రభుత్వముతో సంప్రదింపులు జరుపుటకు ఆగస్టు 21 వ తేదీన ఆయన ఇక్కడకు వచ్చాడు.

మధ్యజావా రంగంలో, తాము నాటిన మందుగుండుపై సుంఛా నడవడం వలన ఒక టాంకు నాశనమైనట్లు డచ్చి సైనికులు 8 మంది మరణించినట్లు, 37 గురు గాయపడినట్లు రిపబ్లికనులు ప్రకటించారు, కీలకస్థానమును ప్రాబోలింగోను తాము వశపరచుకొన్నట్లు కూడా వీరు చెపుతున్నారు.



### తూర్పు ఇండోనేసియా ప్రధాని తొలగింపు

బటేవియా, సెప్టెంబరు 21 : తూర్పు ఇండోనీసియా అధ్యక్షుడు సాయెకవాటి, తన ఖజానాశాఖ, దేశీయశాఖమంత్రులతో పాటు సండి రేపు హేగ్ వెళ్లి, గురువారం నాడు బటేవియాకు ప్రయాణమై రానున్నట్లు తెలుస్తున్నది.

తూర్పు ఇండోనీసియాప్రధాని నజామొద్దీన్, ఆర్థిక శాఖామంత్రి జాజామొద్దీన్ గారలు లంచగొండులయినట్లు రుజువుకావడం వలన వారిని బర్తరఫు చేస్తూ, తూర్పు ఇండోనీసియా తాత్కాలిక అధ్యక్షుడు సుంబావాతులాక్ ప్రకటించినట్లు మకాసా నుండి వార్తలు వచ్చినవి. ఆరోగ్యమంత్రి డా. వారో ప్రధానమంత్రి గాను, రవాణా శాఖమంత్రి డా. సెమకీ ఆర్థిక మంత్రిగాను ఇతరుల నియామకం జరిగేవరకు వ్యవహరిస్తుంటారు. నజామొద్దీన్ డచ్చి ప్రభుత్వ తూర్పు ఇండియా కార్యాలయంలో ఒక ఉద్యోగిగా వుండేవాడు. డచ్చి ప్రభుత్వం తూర్పు ఇండోనీసియా రాజ్యమును ఏర్పరచినప్పుడు దానికి అతనిని ప్రధానిగా నియమించింది. తన రాజ్యమును అన్ని దేశాలు గుర్తించవలెనని ఈయన ఒక ప్రకటన చేశాడు కాని డా. షరీరు ఈ ప్రభుత్వము కీలుబొమ్మ ప్రభుత్వమని విమర్శించాడు. నజామొద్దీన్ యిప్పుడు పోలీసులలో ఉన్నాడు.



## యూరప్ పునరుద్ధరణ

### 16 రాజ్యాల సభలో తయారైన నివేదిక

ప్యారిస్, సెప్టెంబరు 21: యూరప్ పునరుద్ధరణ సమస్య విషయమై 16 రాజ్యాల సమావేశం జరిపిన కృషి ఫలితంగా, మార్షల్ ప్రణాళికను అనుసరిస్తే రిఘానాన్ని సూచిస్తూ ఒక నివేదిక తయారైంది. ఈ నివేదికను, రేపు ప్యారిస్ లో 16 రాజ్యాల సమావేశం పూర్తిగా ఆమోదిస్తుంది. అయితే యిప్పుడు తయారైన నివేదికే తుది నివేదిక గాదని, అమెరికా పలుకుబట్టి యిది సవరింపబడవచ్చునని తెలుస్తున్నది. 16 యూరోపు రాజ్యాల సమావేశంలో పాల్గొనే నాయకులకు, అమెరికా ప్రభుత్వోద్యోగులకు మధ్య జరిగే సమాలోచనల పర్యవసానంగా, ఈనివేదికలోని సంఖ్యలు, ప్లానులు కొన్ని మార్పు చేయబడవచ్చు. ఈ నివేదిక 16 యూరోపు రాజ్యాల సమావేశంలో ఆమోదింపబడిన వెంటనే, దీనిని, సమావేశంలో పాల్గొన్న పెద్దలు, వాషింగ్టన్ కు తీసుకొని వెళతారని తెలుస్తున్నది.



ఇది 20 వేల పదాలతో (అనుబంధాలను మినహాయించి) కూడుకొన్న సుదీర్ఘమైన నివేదిక. ఇది ఉపోద్ఘాతముతోపాటు 7 అధ్యాయాల క్రింద రచింపబడింది.

ఇందులో రెండు విషయాలు చాలా ముఖ్యమైనవిగా పరిగణింపబడ్డాయి. మొదటిది తమ తమ ఉత్పత్తి పెంపొందించుకోడానికి, పరస్పర సహకారంతో ఒకటినొకటి ఆనుకోవడానికి, యూరోపురాజ్యాల మధ్య, తుదకు, ప్రపంచ దేశాలన్నింటిలోనూ మారకం పొందగలిగే స్థాయిగల సుస్థిరమైన ద్రవ్యమానాలను నెలకొల్పడానికి గాను 16 రాజ్యాల పథకాలు, ప్రయత్నాలు పీటికి సంబంధించినవి. రెండవది. అమెరికా ఆర్థిక విధానం, యూరోపా పునరుద్ధరణ, యివి ఒక దానిపై ఒకటి ఎలా ఆధారపడి ఉండాలోనని రూపించేది.



### డా॥ రాజేన్ద్రబాబుతో గాంధిజీగోష్ఠి

న్యూఢిల్లీ, సెప్టెంబరు 21: గాంధీమహాత్ముడు ఈరోజు సాయంత్రం డా॥ రాజేంద్రప్రసాద్ ఇంటికివెళ్లి చూచినాడు. కొద్దిరోజులనుంచి రాజేంద్రప్రసాద్ సుస్తీగా ఉంటూఉన్నారు. రాజేంద్రప్రసాద్ మంగళవారంనాడు పిలానీ.ట్రస్టు వెళతాడని తెలుస్తూవుంది.

## ఢిల్లీలో శాంతి స్థాపన ప్రయత్నాలు

### ముస్లిములు వారి వారి ఇండ్లకు పోవలెనని విజ్ఞాపనము

న్యూఢిల్లీ, సెప్టెంబరు 21: ఈరోజున ఢిల్లీ ఎమర్జన్సీ కమిటీవారు, సి. హెచ్. భాభా అధ్యక్షతన సమావేశము అయి ఢిల్లీ ముస్లిములకు ధైర్యము కలగ చేసేటందుకు ఉపాయాలను గురించి యోచించినారు.

తమతమ నివాసాలలో ఉంటూఉన్న ముస్లిముల మున్నూ, భయపడిపోయి తమ తమ ఇండ్లు వాకిళ్లు వదిలిపెట్టి వచ్చి ఆయా ప్రభుత్వ శిబిరాలలో ఉంటూ ఉన్న ముస్లిములకున్నూ వారివారి ఆస్తిపాస్తులను ప్రభుత్వమువారు కాపాడుతారనీ వారికి ప్రాణభయము కలగకుండా బందోబస్తు చేస్తారనీ సాధ్యమము అయినంత త్వరలో యథా మూలం జీవనము ఏర్పడేటందుకు సమస్త విధాలా పాటుపడుతారనీ తెలియచెప్పవలెనని నిర్ణయించినారు. ఇందుకుగాను ముందుగా కొన్ని కొన్ని ముస్లిము ప్రదేశాలలో మామూలు పరిస్థితులు ఏర్పడేటందుకు మిలిటరీగస్తీని హెచ్చు చేయవలెననీ ఇంకా ఎక్కువగా పోలీసులు కాపలా ఉండవలెననీ ఢిల్లీ చీఫ్ కమీషనరుకున్నూ మిలిటరివారికిన్నీ తెలియచేసినారు. ఈవిధముగా కొన్ని ప్రదేశాలలో ఏర్పాట్లుచేసి ముస్లిముల ధైర్యముకలిగి ఆప్రదేశాలలో నివసించడము ఆరంభించగానే తక్కిన ప్రదేశాలలో కూడా క్రమేణా ఈవిధమయిన ఏర్పాట్లు చేసుకొంటూ పోవలెనని ఎమర్జన్సీకమిటీ వారి అభిప్రాయము. ఢిల్లీ స్థానికాధికారులు ఆయాప్రాంతాలలో సంచారము చేసి అనధికారులయిన ముస్లిము నాయకులను హిందూ నాయకులను కలుసుకొని వారి సహాయముతో శాంతిసంఘాలను నెలకొల్పవలెననీ కూడా సూచించినారు. ఈసందర్భంలో గాంధి మహాత్ముడున్నూ మౌలానా అబుల్ కలాం ఆజాద్ న్నూ చేసిన పనులను అనుసరించవలెనని ఎమర్జన్సీ కమిటీవారు నిర్ణయించినారు.



తమ తమ ఇండ్లు వదిలిపెట్టి పోవద్దని ముస్లిములకు సలహా చెప్పినారు. కాందిశీకుల శిబిరాలకు వచ్చిన ముస్లిములను తిరిగి తిరిగి తమ తమ ఇండ్లకు పోవలసిందని ప్రోత్సహించదలచినారు. ఇప్పుడు ఢిల్లీ నగరములో వచ్చిన చిక్కు అంతా స్థానికము కాదనీ అనేక సమయాలలో స్థానిక హిందువులు స్థానిక ముస్లిములు కాపాడినారనీ ముస్లిములు ఇదివరకే ఒప్పుకొన్నారు. కాందిశీకుల శిబిరాలకు వచ్చివేసిన ముస్లిములను తిరిగి తమతమ ఇండ్లకు పోవలసిందని ప్రోత్సహించే విషయమై కమిటీవారు తీవ్రముగా యోచించినారు. కాందిశీకుల శిబిరాలకు వచ్చినట్లయితే ఇండియా ప్రభుత్వమువారు ఉచితముగా అన్నము పెట్టి ఉచితముగా రైలుబండ్లలో సమస్త సౌకర్యాలతో పాకిస్తానుకు పంపించివేస్తారనే దుష్ప్రచారము జరిగినందువల్ల ముస్లిములు అసంఖ్యాకముగా కాందిశీకుల శిబిరాలకు చేరుతున్నారు. అయితే పాకిస్తానుకు పోదలచుకొన్న ముస్లిములను ఇండియాప్రభుత్వము యథేష్టముగా పోవడానికి అంగీకరించినారు. కాని మిగతావారువారివారిఇండ్లకు ఏభయమూ లేకుండాపోయి నివసించవలెనని ప్రభుత్వమువారి అభిప్రాయము. ఇందుకుగాను అన్ని వర్గాలకు సంబంధించిన అనధికార నాయకులతో సంఘాలను ఏర్పరిచి ప్రజలకు యథార్థ విషయాలను తెలియచెప్పవలెనని ఎమర్జన్సీ కమిటీవారు అంగీకరించినారు. ఇప్పుడు పురాణ కిల్లాలోనూ హుమయూన్ గోరీవద్దకూడున్న శిబిరాలన తప్ప మరొక శిబిరాన్ని ఏర్పాటు చేయవలసరములేదని ఎమర్జన్సీ కమిటీవారు నిశ్చయించినారు.



### శరత్‌బోసు ఇల్లు పోలీసు సోదా

కలకత్తా, సెప్టెంబరు 21 : కలకత్తాకు పది మైళ్ల దూరములో ఉన్న రిప్రా అనే ప్రదేశములో శరత్ చంద్రబోసు తాలూకు ఉద్యానవన గృహాన్ని ఈరోజు ఉదయం సి. ఐ. డి. శాఖకు సంబంధించిన పోలీసులు సోదా చూచినారు. సోదా మామూలు రెండు గంటలసేపుసాగింది. అయింటిపారుగునకుండి ఆఇంటిని చూస్తూఉన్న భాకత్ సాహు ఖాన్, ఆ నేతయనను పోలీసువారు అనేక ప్రశ్నలు వేసినారు. ఆ ఇంటిలో మంచి పోలీసువారు ఏమీ పట్టుకొని పోలేదు.



### శరత్‌బోస్ సోదరుని కుమారుడు అరెస్టు

కలకత్తా, సెప్టెంబరు 21: శరత్ చంద్రబోస్ గారి సోదరుని కుమారుడు రంజిత్ బోసును ఇంకా నల్గురు యువకులను శనివారంనాడు దక్షిణ కలకత్తాలో జరిగిన దొంగదోపిడి కేసులో పోలీసులు అరెస్టు చేశారు. వీరివద్ద టామీగన్నూ, రివాల్వర్లు, కత్తులు దొరికినట్లు తెలుస్తున్నది. యు. ప్రె.



## వేరుశెనగనూనె ఉత్పత్తి, ఎగుమతులు

### కౌన్సిలులో ప్రశ్నలకాలం

#### సర్కార్లలో నజరానా

చెన్నపట్నం, సెప్టెంబరు 22 : డా॥ వి. క. జాన్ గారు నేడు మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిలు 11 గంటలకు సమావేశమైనపుడు అధ్యక్ష స్థానమును అలంకరించిరి. వేరుశెనగ ఉత్పత్తి ఎగుమతులు, తెలుపుమా ఆహారమంత్రి ప్రశ్నలకాలంలో సభ్యులు పుచ్చుకున్న వారందరికేస్తు చెప్పుట ప్రజాక్షేమమునకు మంచిదికాదనిరి.

ఆహారమంత్రి డా॥ రాజన్ గారు ఆర్. సూర్యనారాయణరావుగారికి సమాధానముగా ఉత్పత్తి వినియోగదార సహకార సంఘములద్వారాను, ప్రముఖేటు ఏజెన్సీలు సహకారసంఘములద్వారాను రేషనింగు, కంట్రోలు పెట్టిన వస్తువుల పంపకము జరుగుచున్నదనిరి. సర్కార్లలో కొత్త సంఘములవచ్చి కొద్దికొజాలేఅయినందున సేకరణ పంపకము తిరిగి ప్రయివేటు ఏజెన్సీలకు ఇవ్వబడెననియు, కొన్ని చోట్ల సహకార సంఘములుకూడా పంపకము చేయుచున్నవనియు, అదివరకున్న సహకారసంఘములకుకూడా ఈకార్యం వప్పజెప్పబడెననియు, ఇప్పుడు ఏమియూ ఆశ్చర్యము జరుగుటలేదనియు, ఈ. వి. సంఘముల భవిష్యత్తును అంచనావేయుటకు నియమింపబడిన విచారణ సంఘము నిర్ణయించునవిరి.



#### వేరుశెనగనూనె ఉత్పత్తి ఎగుమతి

శ్రీ భీమారావు గారికి సమాధానముగా ఆహార మంత్రి 44-45 లో 2 లక్షల 72 వేల టన్నులు 45-46 లో 2 లక్షల 65 వేలు, 46-47 లో 2 లక్షల 69 వేల టన్నులు నవంబరు నుంచి అక్టోబరు వరకూ వేరుశెనగనూనె ఉత్పత్తి అయ్యెననిరి. రాష్ట్ర అవసరములకు 1 లక్ష 23 వేల టన్నులు అవసరమని, ఏటా లక్షా 19 వేల టన్నులు ఎగుమతి చేయవచ్చుననియు, 1 లక్ష 19 వేలు, లక్షా 12 వేలు, లక్షా 16 వేలు టన్నులు మూడేండ్లు ఎగుమతి చేయబడె ననిరి. ఎవరెవరికి పర్మిట్లు ఇవ్వ బడెనో పేర్లు యిచ్చుట ప్రజా క్షేమమునకు విరుద్ధమనియు, ఆ క్రమకు తగిన ఫలము ఉండదనియు చెప్పిరి. జిల్లావారీ లెక్కలు ఇచ్చుట సాధ్యము గాదనిరి.



#### గవర్నమెంటుపశాకు

పణుశక్తి వీరభద్రస్వామిగారికి సమాధానముగా వర్లికవర్స్ మంత్రి 40 ఎకరముల స్థలము గవర్నమెంటుపశాకు ప్రాంతములున్నదనియు, గుమాస్తాలకు ఇస్తుకట్టి ఇచ్చుటకు ప్రతిపాదన లేదనియు లేదనియు, ఆవరణలోని తటాకమునందు మత్స్యముల పెంచుటకు నెలకు రూ 30 లు అగుచున్నదనిరి.

#### బ్రాడ్ కాస్టింగ్ శాఖ

రాష్ట్రీయబ్రాడ్ కాస్టింగు శాఖలో 158 గురు ఉన్నారనియు, వారి యోగ్యతార్హతలకు నిబంధనలు ఉన్నవనియూ సూర్యనారాయణరావు గారికి సమాధానముగా గో॥ భక్తవత్సలంగారు వ్రాతపూర్వకముగా చెప్పిరి. ప్రభుత్వసమాధానముదీర్ఘముగానున్నందున, అట్టిసమాధానములుఒక రోజుమందు ఇవ్వవలెనని శ్రీ నారాయణస్వామినాయుడుగారు సూచించిరి.

డా॥ రాజన్ గారు అసలు వాదా సమాధానము లివ్వవలసి ఉండెననియు, సభ్యుల వీలుకోసము అచ్చువేసి ఇచ్చుచున్నామనియు మర్నాడు ఉపప్రశ్నలు వెయ్యవచ్చుననియు చెప్పిరి.

సూర్యనారాయణరావు గారు అందుకు ప్రభుత్వమునకు కృతజ్ఞత తెలుపుమా మర్నాడు ఉపప్రశ్నలు వెయ్యనివ్వవలసినదని కోరిరి.



డా॥ రాజన్ గారు అందుకు ఆక్షేపణ లేదనిరి.

శ్రీ కళా వెంకట్రావు, భక్తవత్సలం, గోపాలరెడ్డిగారలు ఉపప్రశ్నలు వెయ్యదలచుకున్నవారు అధ్యక్షులకు వ్రాయవలెనని సూచించగా మర్నాడు ఉపప్రశ్నలు వేయవచ్చుననియు, ఈ విషయమై "సూలింగు" శాశ్వత అధ్యక్షులకు వదలి వేయుచున్నామని తాత్కాలికాధ్యక్షులు డా॥ వి. క. జాన్ గారు చెప్పిరి.

రెవెన్యూమంత్రి కళా వెంకట్రావు గారు ఆర్. సూర్యనారాయణరావుగారికి సమాధానముగా సర్కార్లలో ఆయకట్టులో చేర్చబడిన భూములకు 1939 వరకూ 6,90,472-1-7 వరకూ మరమ్మతుకునీ, నజరానాలనియు వసూలుచేయబడెననియు, తర్వాత ఎంత వసూలుచేయబడెనో, లెక్కలు లేవనియు, ఇప్పుడు అది అమలులో లేదనియు చెప్పిరి.

ఎలిమెంటరీ స్కూళ్ళపిల్లలకు మధ్యాహ్నం వేళ భోజనంపెట్టే ఏర్పాటువల్ల ప్రభుత్వం చాలా వ్యయమును భరించవలసియుంటున్నందున ఆ పద్ధతి యిపుడు మానివేయడమైనదని విద్యామంత్రి శ్రీ అవినాశిలింగం చెట్టిగారు శ్రీ ఆర్ సూర్యనారాయణరావుగారి ప్రశ్నకు సమాధానంగా చెప్పిరి. అట్టి ఏర్పాటును ప్రస్తుత ఆర్థిక స్థితిలో తిరిగి పునరుద్ధరించడం సాధ్యం కాదనికూడా వారు సెలవిచ్చిరి.



#### నీటి తీరువాల రకాలు

అన్ని జిల్లాలలో ఒకే విధమైన నీటితీరువాల రేట్లులేవనియు ఆయా ప్రాంతాల స్థితిగతులబట్టి రేట్లు మారుతున్నవనియు స్టాండర్డు రేటు వ్యత్యాసపు రేట్లు ప్రత్యేక ప్రాజెక్టులకు ప్రత్యేకరేట్లు మొదలగు రకాలున్నవనియు యీ వ్యత్యాసపు రేట్లు విశాఖ, కర్నూలు, కడప, నెల్లూరు జిల్లాలలో కొన్ని భాగాలలో అమలులో నుంటున్నవనియు రివిన్యూమంత్రి శ్రీ కళా వెంకట్రావుగారు శ్రీ ఆర్ సూర్యనారాయణరావు ప్రశ్నకు సమాధానంలో తెలిపిరి.

## ఫిలిప్పైన్సు నుంచి కొబ్బరినూనె దిగుమతి

### కోటా దరఖాస్తులు : ప్రభుత్వ ప్రకటన

న్యూఢిల్లీ, సెప్టెంబరు 21 : దేశంలో అనేకమంది వినిమయదారుల ఉపయోగం నిమిత్తం, 8 వేల టన్నుల కొబ్బరినూనెను భారత ప్రభుత్వం కేటాయించింది. జులై 7 వ తేదీన పత్రికల ద్వారా ప్రభుత్వం చేసిన ప్రకటన ననుసరించి, నూనె కావలసినవారు ప్రభుత్వానికి దరఖాస్తులు పెట్టుకొన్నారు. ఈరోజున జారీచేసిన పత్రికా ప్రకటనలో ప్రభుత్వం యీ విధంగా తెలియజేసింది.



"నూనెకోటా కొరకు దరఖాస్తు పెట్టుకొన్నవారికి, ప్రభుత్వం నుండి యే విధమైన సమాధానంగానియెడల, వారికి ప్రభుత్వం నూనెను కేటాయించలేదని తెలుసుకోవాలి. ఇంకా వీరు ప్రభుత్వంతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపినందువల్ల ప్రయోజనం లేదు. వాటిని ప్రభుత్వం లక్ష్యపెట్టదు. మిగిలిన దరఖాస్తుదారులు, అంటే నూనె కేటాయింపబడినట్లు ప్రభుత్వంనుంచి వర్తమానం పొందినవారు, ఎగుమతి లైసెన్సులకోసం వెంటనే పిలిప్పైన్ ప్రభుత్వానికి, దిగుమతి లైసెన్సులకోసం, చీఫ్ కంట్రోలర్ కు వ్రాసుకోవాలి.

ఈ 8 వేలటన్నుల కొబ్బరినూనెతో పాటు 10 వేలటన్నుల ఎండుకొబ్బరిని పిలిప్పైన్ దీవులు ఇండియాకు కేటాయించాయి. మలయా 5 వేల టన్నులు, డచ్చి తూర్పుదీవులు 10 వేలటన్నుల కొబ్బరిని ఇండియాకు దిగుమతి చేయడానికి సమ్మతించాయి.



## కరాచీలోని మదరాసు రాష్ట్రీయులు

### ప్రత్యేకఓడలో బయలుదేరి వస్తారట

మద్రాసు, సెప్టెంబరు 21 : కరాచీలో నున్న మద్రాసురాష్ట్రవాసులు, స్వరాష్ట్రానికి తిరిగివచ్చేయడానికి తగిన సౌకర్యాలు లేనట్లు తెలుస్తున్నది. పీటి విషయము ఆలోచించండి అని మద్రాసు ప్రధాని చోయిత్ రాం గిద్వానికి లోగడ వర్తమానం పంపాడు, మద్రాసు రాష్ట్రవాసులు రేపు 28 వ తేదీన స్పెషల్ స్టీమరులో బయలుదేరి మద్రాసుకు వస్తున్నారని చోయిత్ రాం గిద్వాని మదరాసు ప్రధానికి తెలియజేశాడు.

### ఆంధ్ర జిల్లాలలో అధిక వర్షపాత సూచన

మద్రాసు, సెప్టెంబరు 22 : బంగాళా ఖాతంలో సర్కారు జిల్లాల తీరానికి సమీపాన ఒక గుండం (డిప్రెషన్) ఏర్పడింది రానున్న 48 గంటలలో సముద్ర సమీప ఆంధ్ర జిల్లాలలో విపరీతమైన వర్షం కురవచ్చు. సర్కారు, రాయలసీమ జిల్లాలలోనూ, క్రితం రోజున విశేష వర్షపాతం సంభవించింది.



### కీ॥ శే॥ ఏ. యల్. నారాయణ రావుగారు

మద్రాసులో ప్రకటింపబడుచున్న ధంకా పత్రిక కార్యాలయ నిర్వాహకులుగా సుమారు 13 సంవత్సరములనుండి యుండి పనిచేయుచుండిన ఏ. యల్. నారాయణరావు గారు గత శుక్రవారం 19-9-47 తేదీ మధ్యాహ్నము స్వర్గస్థులైరి. నాలుగు దినములు మాత్రమే జ్వరబాధ పీడితులై ఆకస్మికముగా సుమారు 30 సంవత్సరముల వయస్సులో మరణించిరి.

## అరెస్టైన ఉద్యోగులు ఆంగ్లో ఇండియన్లట

జబ్బల్పూరు, సెప్టెంబరు 21: లైసెన్సు లేనిఆయుధాలు ఉన్నందువల్ల పట్టుకొని యిక్కడ శిబిరములో నుంచబడిన అధికారులు ఇద్దరున్నూ పాకిస్థానుకు చెందిన ఆంగ్లో ఇండియనులని తేలినది. ఈసందర్భములో పోలీసు ఇన్‌స్పెక్టరు జనరల్ స్వయముగా దర్యాప్తు చేస్తున్నాడు.



# మంత్రులవద్దకు రాయబారం

## నీటికొళాయిల స్కీము

ఉరవకొండ సెప్టెంబరు 17: ఉరవకొండ పంచాయతీబోర్డు తరఫున సవారాయణప్ప, యం. సి. నరసింహులు, పాకం చిన్నసంగలప్ప, సీనుస్వామి శెట్టి. గనీసాహేబ్ బి. ఖాజాసాహెబ్ గార్లున్నూ, పట్టణము తరఫున పెద్దకోట నాగప్పగారున్నూ కలిసి నీటి కొళాయిల స్కీమును మంజూరు చేయవలసినదిగా కోరుటకు పరిశ్రమలమంత్రి శ్రీ హెచ్. సీతారామిరెడ్డిగారిని స్థానిక పంస్థల మంత్రి కల్లూరి చంద్రమౌళిగారినిన్నీ కలుసుకొని తమ గ్రామములో నీటికొళాయిలు స్కీము ఖర్చు 6 లక్షల 60 వేల రూపాయలు అగుననియు, అందులో సగము మొత్తము విరాళముగానూ మిగతసగము అప్పుగానూ ప్రభుత్వం ఇవ్వాలనీ, అప్పును 30 సంవత్సరాలు వాయిదాలుగా వడ్డీతో తీర్చుటకు బోర్డు ఆర్థిక పరిస్థితులు తగినట్లుగా నున్న వనియూ వివరముగా చెప్పిరి. నీటికరువుచే బాధపడువారను గనుక త్వరలో యిక్ బట్టు సేషన్లకు వుత్తరువు చేయవలయునని యూ, అందుకు రు 4000 వాలును వేలం రూపాయలు చెల్లించెదమనియూ తెలిపిరి.

అందుకు ఉభయమంత్రులు తాము కష్ట పరిస్థితి ఖుద్దున చూచినామనియూ సాధ్యమయినంత "ప్రయారిటీ" యిప్పించుటకు తగిన వుత్తరువులు పంపించుటకు సాయపడుదుమనియూ వాగ్దానంచేసిరి.

## రాజమండ్రి జైలులో ఖైదీ దౌర్జన్యం

రాజమండ్రి, సెప్టెంబరు 16: స్థానిక సెంట్రలు జయిలు సూపరింటెండెంటు ఖాన్ బహద్దరు మల్లిక్ మహమ్మద్‌యూసఫ్ గారు నిన్న మామూలు ప్రకారం స్టోరు రూము పరీక్ష చేయుచుండగా సెంటియప్పను అనే తమిళ ఖైదీ కత్తితో సూపరింటెండెంటుగారి మీదపడి మెడమీదను, ఛాతీ చోట్లను పొడిచెను. సెంటియప్పను తక్షణమే ప్రక్కవారు పట్టుకొనిరి. లాకప్పులో పెట్టిరి. పోలీసువారు కేసునమోదుచేసి విచారణ జరుపుచున్నారు.

## కీ. శే. దువ్వూరి రామిరెడ్డిగారు

### పలుచోట్ల సంతాపసభలు

పొదిలి, సెప్టెంబరు 14: స్థానిక భారత సమితివారు నేటి ఉదయము శ్రీ బి. వి. సుబ్బయ్య చౌదరిగారి అధ్యక్షతన సమావేశమై కవికోకిల శ్రీ దువ్వూరి రామిరెడ్డిగారి భాషాసేవను ప్రశంసిస్తూనూ, వారి అకాల మరణానికి సంతాపం వెల్లడిస్తూనూ తీర్మానంచేశారు.

### హిందూపురం

హిందూపురం, సెప్టెంబరు 15: కవికోకిల దువ్వూరి రామిరెడ్డిగారి మరణమునకు సంతాపమును తెలియజేయుచు హిందూపురమునందు లలితకళా గురుమూర్తిగారి అధ్యక్షతను నిన్న సభజరిగెను. బాలకవి హనుమంత రెడ్డిగారు, జనాబ్ మసూదు అలీ, విద్వాన్, చిన్నమణూరు రామరావు, దుర్భాక కృష్ణయ్య, బైసాని సూర్యనారాయణ, మహేశమద్రము వెంకటరామ శాస్త్రిలు మొదలగువారు రామిరెడ్డిగారి కవితా నైపుణ్యమును గురించి ప్రసంగించిరి. రామిరెడ్డిగారి స్మారక సంచిక నొకదానిని ప్రకటింప తీర్మానించిరి.

### భద్రాచలం

స్థానిక విద్యార్థి సాహితీ సమితివారు నేటి సాయంకాలము శ్రీమాన్ పొడిచేటి రంగాచార్యులుగారి అధ్యక్షతను సభచేసిరి సి. యస్. చౌదరిగారు, ఏ. వి ఆర్. రంగాచారిగారు, యస్. శ్రీరామమూర్తిగారు కవిగారి భాషాసేవను ప్రశంసించిరి దేవగుప్త నాగేశ్వరరావుగారిచే పద్యములు చదువబడెను. రామిరెడ్డిగారి ఆత్మకు శాంతినికోరుచు వారి కుటుంబమునకు సభవారు తమ సానుభూతిని వెల్లడించిరి.

### హరిజనోద్యోగికి సన్మానం

మదరాసు, సెప్టెంబరు 22: శ్రీ బి. ఎస్. మూర్తిగారు నవజీవనపత్రికా సంపాదకులు, ఇండియాప్రభుత్వం డిప్టీ సెక్రటరీ ఎస్. నీలకంఠంగారికి "పుదులంక్సాలో" గావించిన విందునకు మంత్రులు కూర్మయ్య, కళా వెంకట్రావు, భక్తవత్సలం గార్లు, స్వామి ఎ. గోవిందరాజాచారి, డాII వి. నారాయణస్వామి నాయుడు, వి. శ. జాను, ఎం. కె. వి. రెడ్డి కొప సుబ్బారావుగార్లు మొదలగు పెద్దలు సుమారు 50 మంది విచ్చేసిరి.

బి. ఎస్. మూర్తిగారు, నీలకంఠంగారొక్కరే తమ సమర్థతవల్ల ఇండియా ప్రభుత్వం డిప్యూటీ కార్యదర్శిగ స్థిరంగా నియమింపబడిన హరిజనులనియూ, వీరు సర్ ఆర్. వెంకటరత్నం నాయుడుగారి సద్గుణములను అనుకరించి వారి సుగుణములన్నీ అలవడి ఉన్నతికి వచ్చిరని హరిజనోద్ధరణకు తనుసేవచేయుచున్నారని తెలిపిరి.

ఎస్. శివరాజుగారు, డాII అంబేడ్కరుగారు కేంద్రప్రభుత్వమందు అధి-

# టర్కీలో ప్రజాస్వామ్య పాలన

## ఏకపక్ష ప్రభుత్వ విధానం కూడదని వివిధ రాజకీయవర్గాల గుర్తింపు

ఇస్తాంబుల్, సెప్టెంబరు 21: ప్రపంచ దృష్టి నాకర్షించకుండానే, అంతరంగిక మార్పులు, తద్వారా ప్రజాస్వామ్య సిద్ధాంతపు రోగమనము టర్కీలో చెప్పుకోదగినంత బాగా జరిగినవని రాయిటర్ విలేఖరి రాబర్ట్ బగిమో వ్రాస్తున్నాడు.

టర్కీలో ఈ మధ్యజరిగిన రాజకీయ మార్పులవల్ల అధికార ప్రాబల్యమును కొంతవరకు తగ్గించుకుంటూ, అవిభాజ్య ప్రభుత్వం హస్సన్‌సాకా ప్రధానిత్వమున ఏర్పడినది. కెమల్ ఆటాటర్క్ చే ఏర్పాటుచేయబడిన ఏకపక్ష విధానం టర్కీకి తగదని అందరూ గుర్తిస్తున్నారు. 1946 వ సం. జనవరిలో మాజీప్రధాని సెలాల్ బేయర్ ఆధ్వర్యమున పార్లమెంటు సభ్యులు నలుగురు డెమోక్రటిక్ పక్షం ఏర్పరచి, ప్రజాస్వామ్య ప్రభుత్వమును ఏర్పరతుమని వాగ్దానంచేసి, మొన్న జరిగిన ఎన్నికలలో పార్లమెంటులో 64 స్థానాలు సంపాదించారు. వీరిపై ప్రభుత్వపక్షమగు ప్రజాపక్షము, ప్రభుత్వోద్యోగులు అత్యాచారములు చేస్తున్నారని వీరు ఆరోపణలు చేశారు. ప్రజాపక్ష అధ్యక్షుడు, టర్కీ అధ్యక్షుడునగు ఇనోనూ బేయర్‌తోను అప్పటి ప్రధానమంత్రియగు పెకర్‌తో సంప్రదింపులు జరిపి, తరువాత జులై 12 వ తేదీన ఒక ప్రకటన చేశాడు. టర్కీలో రెండుపక్షములు ఏర్పడినవనీ, అధ్యక్షుడుగా తాను మధ్యవర్తిగానుండకతప్పదనీ అందరు పౌరులను సమానముగానే చూడవలెననీ ఈయన ప్రకటనలో తెలియజేశాడు. తరువాత ప్రజాపక్షంలో రాజకీయసంచలనం ప్రారంభమైనది. పెకర్‌పై ఏకగ్రీవంగా విశ్వాసం ప్రకటింపబడినా, అతడు తన మితవాదమును వదలుకొంటూ తనమంత్రివర్గమును పునర్నిర్మాణం చేయటం, చివరకు రాజీనామా నివ్వటం జరిగింది. మాజీ విదేశాంగమంత్రియగు హసన్ సాకా యిప్పుడు ప్రధాని అయినాడు. ఇతడు మితవాదకాదు; అనుభవజ్ఞుడు. ప్రజాస్వామ్య సూత్రములను ఇతోధికముగా పాటించుటయే ఈయన లక్ష్యము.

### విదేశబాధితులకు టర్కీ శరణ్యం

ఇస్తాంబుల్, సెప్టెంబరు 21: ఒకప్పుడు యూరప్‌లో హిట్లర్ బాధలకు తాళలేక పారిపోయివచ్చిన యూదులకు శరణ్యంగా వుండేది. ఇప్పుడు మరొకరకపు రాజకీయ బాధితులు, సంఖ్యతక్కువగానే అయినా, నిరంతరమూ టర్కీ వస్తూనే వున్నారు. వీరుకమ్యూనిస్టు ప్రాబల్య ప్రాంత యూరప్‌నుండి పారిపోయివస్తున్న రుమేనియా, బల్గేరియా, యుగోస్లేవియా, గ్రీస్ ప్రజలు.

వీరిలో రుమేనియా బాధితులసంఖ్య చాలా హెచ్చు. రుమేనియాలోని కాన్‌స్టాంజా రేవునుండి రహస్యంగా నల్లసముద్రంపై చిన్న పడవలలో వీరు టర్కీ చేరుతున్నారు. కమ్యూనిస్టు "నిర్బంధనలకు తాళలేక" పారిపోయివచ్చిన వీరిలో ఒక రుమేనియన్, రాకుమారుడు, అతని కుటుంబమూ వున్నారు. విమానములపై సాహసవంతంగా ఈమధ్య కొందరు బాధితులు వస్తున్నారు. వారిలో మస్కౌ బుఖారెస్టునుండి, క్రమోవాకు ఒక విమానం అద్దెకు తీసుకుని, మధ్యత్రోవలో పిస్టల్ చూపించి అడ్డుపడుతున్న మెకానిక్కును కాల్చి చంపి, ఆ విమానం టర్కీకి మరలించారు. మరొక విమానతోడుడు, తన విమానంతో పాటు పారిపోయివచ్చి, తాను రాజకీయ బాధితుడనని, ఆ రెస్టు చేయవలసిందని కోరాడు.

బల్గేరియానుండి వస్తున్న బాధితుల సంఖ్య యింతకన్న కొంచెం తక్కువే; కాని వ్యవసాయదారుల పక్షమును పెట్కావ్ పక్షమునకు చెందిన 8 రు పార్లమెంటుసభ్యులు, 4 రు ఇతరసభ్యులు కాందిశీకులుగా టర్కీ వచ్చారు. బల్గేరియాలో, కమ్యూనిస్టువిలయం తాండవం చేస్తున్నదని వీరన్నారు.

యుగోస్లేవియా కాందిశీకులు చాల కొద్దిమంది, వీరిలో శాసనసభ్యుడు ఒకడున్నాడు.

గ్రీస్‌నుండి మరొకరకపు బాధితులు వస్తున్నారు. గ్రీస్‌లోని థ్రేస్ రాష్ట్రంలో టర్కులు చాలమందివున్నారు. ఈ ప్రాంతంలో గోరిల్లా ఉద్యమం ఉగ్రంగా ఉండటంవలన, తమకుసహాయం చేయవలసిందని గోరిల్లాలు, సహాయం చేసినందుకు ప్రభుత్వసైనికులు, వీరిని బాధిస్తున్నారు. అందువలన ఒక వెయ్యిమంది టర్కీవచ్చి తలదాచుకుంటున్నారు. అల్పసంఖ్యాకులైన టర్కులకు రక్షణ యివ్వవలసిందని టర్కీకోరగా, గ్రీస్‌ప్రభుత్వం తన నిస్సహాయస్థితిని తెలిపి, చేతనైనంత సహాయం చేయుటకు వాగ్దానంచేసింది. అందువలన తాను సంతృప్తిజెందితినని ప్రధానమంత్రి సాకా పార్లమెంటులో చెప్పాడు. బాధితులు ఏదేశంవారైనా సరే టర్కీ వేదికనుంటా, వారు కోరినంతకాలం ఆశ్రయమిస్తుందని ఈయనచెప్పాడు. బాధితులకు రక్షణ కలగజేయుటకు, కమ్యూనిస్టులు వీరిలో జొరబడకుండుటకు, ప్రభుత్వం వీరికి పోలీసుసహాయం ఏర్పాటు చేస్తున్నది.

### బర్మాప్రధాని లండన్ వెళ్లనున్నాడా?

రంగూన్, సెప్టెంబరు 21: బర్మా ప్రభుత్వ రాజ్యాంగ సలహాదారు యుఖాన్ వాటూన్, అక్టోబరు మాసారంభంలో లండన్, వెళ్లునని ఈ రోజు ప్రకటింపబడినది. బర్మా రాజ్యాంగ పరిషత్తు ఆమోదించిన రాజ్యాంగచట్టంవలన గలుగవలసిన మార్పుల విషయమై ఈయన లండన్‌లో సంప్రదింపులు జరుపునట. బర్మాప్రధాని థాకిన్‌నూ కూడా ఈ సందర్భంలో లండన్ వెళ్ల నుద్దేశించుచున్నట్లు తెలుస్తున్నది.

### ప్రయాణీకుల సంఘం

చెన్నపురి, సెప్టెంబరు 22: చెన్నపురి ప్రయాణీకుల సంఘమునకు నిన్న సాయంకాలం రెనడే హాలులో ప్రారంభోత్సవం జరుపుమూ మద్యనిషేధ శాఖ మంత్రి డాII డేనియల్ థామస్‌గారు బస్సు రవాణా ప్రభుత్వపరం చేయు కార్యక్రమమును జయప్రదంగా సాగించుటకు ప్రజలు సహకారం చేయవలెనని విజ్ఞప్తిచేసిరి.

డాII అళగప్ప చెట్టియార్ అధ్యక్షత వహించిరి.

చెన్నపురిలో బస్సురవాణాను ప్రభుత్వ పరంచేసుకొనుట అక్టోబరు మాసమధ్యానికి పూర్తికాగలదని యీరాష్ట్రంలో యావత్తు రవాణాను స్వాధీనపరచుకొనుటకు 5 సంవత్సరములు పట్టుననియు మంత్రిగారు తెలిపిరి. చెన్నపట్నంలో రాకపోకల రద్దీ అధికంగా ఉన్నందువల్ల, కొంతకాలమైన పిదప సైక్లు స్టేషన్లను పట్నం మధ్యలోనుంచి తీసివేయవలసి వస్తుందనికూడా తెలిపిరి.

### గమనిక

22. వతేదీ 'ఆంధ్రపత్రిక' 5వపేజీలో ప్రచురితమైన నారాయణరావుగారి సన్మానము, వార్తలు చివరను '25 రూపాయలు' అని ఉండుటకు మారుగా ఒకరూపాయలు అని అచ్చుపడినది — సంపాదకుడు

> **నోబెల్ శాంతి బహుమానం గాంధికే ఇవ్వాలి**
>
> **చైనాపత్రిక ప్రకటన**
>
> షాంఘాయి, సెప్టెంబరు 21:- చైనాపత్రిక "చైనాప్రెస్" అనేది ఈ సంవత్సరము నోబెల్ శాంతి బహుమానము గాంధీమహాత్మునికి ఇవ్వవలెనని సలహాయిస్తూ ఒక వ్యాసము ప్రకటించింది.
>
> "ఈ ప్రపంచములో యుద్ధాలు లేకుండా చేయుటానికి అనేకమంది పాటుపడ్డారు. అయితే వారెవరున్నూ గాంధిమహాత్ముని మాదిరిగా అనేక సందర్భాలలో శాంతిస్థాపనముకోసము తమ ప్రాణాలు అర్పింప సిద్ధపడినట్లు లేదు. అనేకవిధాల ఈ సంవత్సరము గాంధీమహాత్ముడు శాంతిస్థాపనకు పూనుకొన్నాడు, ఆయనకే ఈ శాంతి బహుమానము ఇవ్వవలెను."

# మిలిటరీ ప్రతినిధి ప్రమీక్ష

1-వ పేజీ తరువాయి

వెళ్లుతున్న రైలును సాయుధులైన మంది గుంపు ముట్టడించి రెండు పెట్టెలకు కాల్పు వేశారు. సైనికులు వారితో 40 నిముషాలు పోరాడారు. ఒక వెయ్యి వరకైనా కాల్పుతుంటారు. సైనికులలో కొందరు గాయపడ్డారు. ముస్లిం ప్రయాణీకులలో 12 మంది చనిపోయారు. 37 గురు గాయపడ్డారు 40 మంది ఆచూకీ తెలియలేదు. తర్వాత రైలు సక్రమంగానే ప్రయాణం చేసింది.

అమృతసర్‌నుండి 50 వేల ముస్లిం కాందిశీకులు సురక్షితంగా ప్రయాణం చేస్తున్నారు. వీరిరక్షణకోసం ఇర్ల కొవ్వల మీదా, బజార్ల వెంట, సైనికులు కాపలా ఉన్నారు. అయినప్పటికీ కొన్నిచోట్ల నిబంధనల నుల్లంఘించేవారు తుపాకులు పేల్చగా సైనికులు వారిని ఎదిరించడంలో 6 గురు దుర్మార్గులు చనిపోయారు. 37 మంది గాయపడ్డారు.

తూర్పు పంజాబుకు వస్తున్న కాందిశీక దళాన్ని మేజర్ జనరల్ గయ్యర్ స్వయంగా చూచి దానివెంట కొంతదూరం ప్రయాణం చేశాడు. ఆ ప్రాంతాల్లో వర్షాధిక్యం ఉండడం తప్ప వీరి ప్రయాణానికి మరే ఆటంకమూ లేదని వారన్నారు.

కోటా జిల్లాలో అనుమతిలేని ఆయుధాలతో యథేచ్ఛగా తిరుగుతున్నందువల్ల చాలామంది మహమ్మదీయేతరులను అరెస్టు చేశారు. ఈ జిల్లానుండి పాకిస్థానుకు వెళ్లేందుకై 15 వేల ముస్లిములు ఎదురు చూస్తున్నారు.

కర్నాల్‌కు 15 మైళ్ళదూరంలో 400 మంది ముస్లిం గ్రామీణులు ఆయుధాలతో ఒక సైనికదళాన్ని ఎదుర్కొన్నారు. అక్కడ జరిగిన సంఘర్షణలో దండెత్తి వచ్చినవారు 4 గురు మరణించారు.

గురుదాస్‌పూర్ మీదుగా నిన్న 45 వేలమంది ముస్లిం కాందిశీకదళం ప్రయాణం చేసింది. అమృతసర్ నుండి ముస్లిం కాందిశీకుల ప్రయాణం బాగానే సాగుతోంది.

పశ్చిమ పంజాబులో మహమ్మదీయేతర కాందిశీకదళాన్ని సయాల్‌కోటకు 7 మైళ్ల దూరంలో ఒకదుండగులముఠా ముట్టడించింది బందోబస్తుసైనికులు తుపాకులు పేల్చారుగాని ఇతర వివరాలేమీ తెలియలేదు.

లాహోరులో ఒక సిక్కును ముస్లిం పఠానులు కాల్చిచంపారు. రైల్వేస్టేషను వద్ద మహమ్మదీయేతర కాందిశీకులున్న రైలుపై దుర్మార్గులు తుపాకులు పేల్చారు. 21 మంది చనిపోయారు. 18 గురు గాయపడ్డారు. 7 గురు పఠాన్లను అరెస్టు చేశారు.

ముల్తాన్‌లోకూడా మహమ్మదీయేతర కాందిశీకులను ఖనేవాల్ వద్ద ముట్టడించారు. వివరాలు తెలియలేదు.

కరాచీనుండి కొన్ని సంఘటనలను గూర్చిన వార్తలువచ్చాయి. నడుస్తున్న రైళ్లలో హిందువులను దోచుకుంటున్నారట. ఒకరైలులోనుండి ఒకస్త్రీనీ ఒక పురుషుణ్ణీ బయటికి పారవేశారు. ఒక హిందూ ప్రయాణీకుల ఇన్స్పెక్టరును కుహాకితో కాల్చారు.

పెషావరు పట్టణంలో పాకీవాళ్లు వలస వెళ్లినందువల్ల ఆ ష్ట్రీయ సేవాదళం, ముస్లిం జాతీయ రక్షకసైన్యం మొదలైన సంస్థలకు చెందిన సభ్యులు వీధులు ఊడ్చి బాగుచేస్తున్నారు.

యు. పి. లో లెఫ్టినెంట్ జనరల్ సర్ ఫ్రాన్సిస్ టుకర్ ఆధిపత్యంలో సైనికులుచేస్తున్న కృషి వల్ల పరిస్థితులు బాగుపడ్డట్లు తెలుస్తున్నది. పశ్చిమ జిల్లాలో, కాందిశీకుల ఉద్యోగాలు జరుగుతున్నాయి.

డెహ్రాడూన్, పరిస్థితి చాలా ఉపశమించింది. మీరట్‌లో తమ తమ గ్రామాలు విడిచివెళ్లిన మహమ్మదీయులు తిరిగి వస్తున్నారు.

జ్వాలాపూర్ జిల్లాలో కొన్ని గ్రామాలను విడిచి మహమ్మదీయులు వెళ్ళిపోతున్నారు. మధురా, ఆగ్రా, మీరట్ డివిజనలలో పరిస్థితి అదుపులోకివచ్చింది.

ఢిల్లీ సమీపంలోని నిజాముద్దీన్ గ్రామంలో చాలాఆయుధాలు లభించాయి. 5 పన్నెండు బారుగుండ్ల తుపాకులూ, 5 రైఫిల్సూ, ఒక రివాల్వరూ, 8 సీసాల తుపాకిమందూ, 4 ఇనుప బాంబులూ, 5 గంధపు సాలు (పదునైన ఆయుధాలు), 814 తూటాలు, 191 ఖరసల తుపాకిగుండ్లూ, లభించాయి. ఒక చిన్న నిస్తంత్రీ వార్తా ప్రసారక యంత్రం కూడా పట్టుబడింది. 5 గురిని అరెస్టు చేశారు.

బహదూర్‌గఢ్ శిబిరంలో కలరావల్ల 8 గురు మరణించారు. వైద్యసహాయం చేస్తూనే ఉన్నారు. జిల్లా అంతటిలోనూ పరిస్థితులు పూర్వంకంటే బాగుపడుతున్నాయి.

అంబాలానుంచి ఎటువంటి కల్లోల వార్తలూ రాలేదు.

### పశ్చిమ కాందిశీకులకు ఢిల్లీనుండి ఆహారం

ఢిల్లీలో మహమ్మదీయ, మహమ్మదీయేతర కాందిశీక శిబిరాల్లో ఉన్న ప్రజలకై నిరివిగా ఆహారం సప్లయి చేస్తున్నారు. 60 బస్తాలపప్పూ, 6 బస్తాల ఉప్పూ, రోజుకు 12 టన్నుల చొప్పున 90000 మంది పెద్దకు సరిపోయే ఆహారధాన్యాలూ సప్లయిచేశారు.

పశ్చిమ పంజాబు సరిహద్దు రాష్ట్రీ కాందిశీక శిబిరాల్లో ఆహార సౌకర్యంలేక అల్లాడుతున్న మహమ్మదీయేతరులకోసం భారత సైనికదళంవారు నేటి ఉదయం 125 వర్గ చపాతీలు తీసుకువెళ్లారు.

నిన్న సాయంకాలం ఆరు గంటలకు చాలాకాలంనుంచీ ఆహారంలేక మరదాన్‌లో ఉన్న 93 వేలమంది పశ్చిమ పంజాబు కాందిశీకులకు వెంటనే ఆహారం పంపవలసిందని ఢిల్లీ టేషనుకు వర్తమానం వచ్చిందట. అందుకని రాత్రి అల్లా పనిచేసి ఉదయానికి ఇన్నిమళ్ల చపాతీలూ తయారుచేసి పంపించారు. త్వరలో నే మరి 105 మళ్ల చపాతీలు పంపడానికి ఏర్పాట్లుచేశారు.

### కార్పొరేషన్ ఎన్నికల వాయిదా

మద్రాసు, సెప్టెంబరు 21: మద్రాసు కార్పొరేషన్ ఎన్నికలను ఒక సంవత్సరంవరకు వాయిదా వేయుడానికి మద్రాసు ప్రభుత్వం నిశ్చయించింది.

# "ముస్లిములను పంపివేయడం దేశానికే ఆత్మహత్యసదృశం"

## ప్రార్థనసభలో గాంధిజీ ఉద్బోధ

న్యూఢిల్లీ, సెప్టెంబరు 21: "భారతదేశంలో మహమ్మదీయుల నందరిని పాకిస్థానుకు తరిమివెయ్యాలనడం కేవలం ఆత్మహత్యా సదృశమైన సూచన, 4½ కోట్ల మహమ్మదీయులను తుడిచివెయ్యగలమని అనుకోవడంకంటె వెర్రితనం మరొకటి ఉండదు. నా దేహంలో ప్రాణం ఉన్నంతవరకూ ఎటువంటి విషమపరిస్థితులలోనైనా సరే ఇక్కడి మహమ్మదీయులను ఇక్కడే ఉంచాలని సలహాఇస్తాను." అని మహాత్మాగాంధి నేటిసాయంకాలం ప్రార్థనసభలో మహమ్మదీయుల ప్రస్థానం విషయమై ఒకానొక పత్రిక చేసిన దుష్టసూచనను విమర్శిస్తూ మహోద్రేకంలో ఉద్ఘాటించారు.

ఈనాటి సభలో కొరాన్ పఠనానికి ఒకవ్యక్తి ఆక్షేపణ తెలిపినందువల్ల ప్రార్థన జరగలేదు. బహిరంగసభలో ప్రార్థన జరపనంతమాత్రాన తాను దైవాన్ని విడిచిపెట్టినట్లుకాదనీ, ప్రార్థనకు ప్రశాంత వాతావరణం ఉండడం ముఖ్యమనీ, ఇటువంటి ఆక్షేపణలవల్ల ప్రజాసేవ చేయదలచినవారికి ఎంతో పట్టుదలా, సహనమూ ఉండాలని మాత్రమే తాను నేర్చుకుంటున్నామనీ, ప్రజల్లో ఇప్పుడున్న ఆవేశం తాను గుర్తించినందువల్లనే ఒక్కరు అభ్యంతరం తెలిపినా బహిరంగ ప్రార్థనను తాము మానివేస్తున్నామనీ గాంధిజీ అన్నారు.

తర్వాత గాంధిజీ శ్రీమతి ఇందిరా గాంధితో తాము వెళ్లిచూచివచ్చిన ప్రదేశాలనుగూర్చి చెపుతూ ఇల్లా అన్నారు.

"మేము వెళ్లినచోట ఒకప్రక్క చాలా మంది హిందువులున్నారు. వారికి దగ్గరలోనే వేలకొలదిమహమ్మదీయులున్నారు. హిందువులందరూ నన్ను చూడడంతోటే మహాత్మాగాంధీకి జై అని అరిచారు. ఈ నాడు హిందూ సిక్కు మహమ్మదీయులందరూ సామరస్యంతో సుఖంగా జీవించలేకపోతే నావిజయమూ లేదు, నేను బ్రతికి ఉండాలనీ అనుకోవడంలేదు. సఖీభావం బలం, అనైకమత్యందౌర్బల్యం అన్న నిత్య సత్యాన్ని ప్రజలకు బోధపరిచేందుకు నేను మొదటినుంచీ నాకు చేతనైనట్లుగా కృషి చేస్తున్నాను. కాపుడిగినచెట్టు ఏవిధంగా తాను నశించి మాత్రవృక్షాని శవకాళం ఇస్తుందో ఆ దేవిధంగా నేను చేసిన సేవకు తగిన ప్రతిఫలం లభించనప్పుడు ప్రయోజనవిరహితమైన నా శరీరంకూడా పరిత్యక్తం కావలసిందే! అయితే ఇదంతా నిజమా ప్రతిఫలాపేక్షలేకుండా ప్రతివారూ తమ ధర్మాన్ని తాము నిర్వహించాలన్నదికూడా అంత సత్యమూ అవుతుంది. దేహం నశించినా ఆత్మ నశించదు. అది కొత్తరూపాల్లో నిరంతరసేవాకార్యాల ద్వారా ముక్తికి ప్రాకులాడుతూనే ఉంటుంది.

నేను వెళ్లినచోట ఉన్న మహమ్మదీయులకందరకూ స్వగృహాలు విడిచి వెళ్లవద్దని సలహా ఇచ్చాను. చుట్టుపక్కల హిందువులు వట్టి మతోన్మాదంతో వారి ప్రాణాలకు అపాయం తెచ్చినాసరే వారు అక్కడే ఉండాలి. నా సలహా నను సరించి వట్టయితే మహమ్మదీయులు ఇస్లాంమతానికీ, భారతదేశానికీ మహత్తర సేవ చేసినవారవుతారు. మహమ్మదీయులను హింసించిన హిందూసిక్కులు తమ మాతృభూమికే తీరని హానిచేసినవారవుతారు.

ఇక్కడి మహమ్మదీయులనందరనూ బలవంతంగానైనా ఇక్కడే ఉంచాలని నేనభిప్రాయపడుతున్నట్లు కొందరు భావించారు. సైనిక, పోలీసు సహాయంతో మహమ్మదీయులను తిరిగి తీసుకువచ్చి స్వగృహాల్లో ప్రవేశపెట్టడం నేనెన్న ఈ ఒప్పుకోను. ఇప్పటి తాత్కాలిక క్రోధోన్మాదం ఉపశమించిన తరువాత హిందూసిక్కులు తమంతటతాముగా వెళ్లి సగౌరవంగా మహమ్మదీయ కాందిశీకులను ఆహ్వానించి తీసుకొచ్చుకోవాలని నా వాంఛ. అంతవరకూ కాందిశీకులు ఖాళీ చేసి వెళ్లిన ఇళ్లను ప్రభుత్వం పరిశుభ్రంగా ఉంచాలి. ప్రభుత్వానికి శక్తిలేకపోతే, లేదా ప్రభుత్వం సక్రమ కార్యాలు నిర్వర్తించకుండా ప్రజల క్రోధంతో అడ్డుపడుతూ ఉన్నట్లయితే అధికారంలోఉన్న వారు తమ పదవులకు రాజీనామా ఇవ్వాలి.

ఒక పత్రికలో ముస్లిములను తరిమివెయ్యాలనే సూచనను నేను చూచాను. ఈ సూచన హిందూమతాన్ని సమూలంగా పెకలించి వేసేదేకాక, మన జాతికంతకూ ఆత్మహత్యా సదృశమైనది. ఇటువంటి పత్రిక స్వతంత్ర భారతంలో ఉండవలసిందేనా? పత్రికా స్వాతంత్ర్య మంటే ప్రజాభిప్రాయాన్ని విషపూరితం చెయ్యడానికి అనుమతించడమా? ప్రభుత్వం ఇటువంటి విధానాన్ని అవలంభించాలని అనుకునే వారు అధికారంలో ఉన్నవారిని రాజీనామా ఇవ్వాలని కోరాలి. దాంతో ఇన్నాళ్లనుంచీ భారతదేశం తమకేదో ఒరగబెడుతుందని ఎదురుచూస్తున్న ప్రపంచం యావత్తూ ఇకనుంచీ అలా నిరీక్షించదు. ఏమైనా సరే నాబొందిలో ప్రాణమున్నంతవరకూ నేనీ సూచనను ప్రతిఘటిస్తాను."

ప్రార్థనఅయిన తర్వాత భారత ప్రధాని నెహ్రూ గాంధిజీని సందర్శించారు. ప్రార్థనసభ అయిన తర్వాత గాంధిజీ మౌనదీక్ష ప్రారంభించారు.

# ప్రపంచ ఆహారసమస్య

## అమెరికనులకు హూవర్ హెచ్చరిక

న్యూయార్కు, సెప్టెంబరు 21: అతి క్లిష్టంగా పరిణమిస్తున్న ఆహార కొరతనుండి ప్రపంచమును రక్షించుటకు అమెరికన్ వ్యవసాయదారులు స్వచ్ఛందంగా రేషనింగ్ పద్ధతి ప్రారంభించి, పశువులకు ధాన్యం మేపటం సంపూర్తిగా విరమించాలని అమెరికా మాజీ అధ్యక్షుడు హెర్బర్టు హూవర్ ఒక విజ్ఞప్తి చేశారు.

ఇటలీలో 10 లక్షలమంది వ్యవసాయకూలీలు 12 రోజులు సమ్మెచేయటంగురించి ప్రస్తావిస్తూ, ఇటువంటి సంఘటనల వలన ఇతర దేశములకు సహాయం చేయుటకు అమెరికన్ల ఉత్సాహం తగ్గిపోతున్నదని ఈయన చెప్పారు.

# బోగంమేళం నిషేధబిల్లు

మదరాసు, సెప్టెంబరు 22: ఫిలిం సెన్సారు బోర్డు సభ్యుడు, రిటైర్డు జడ్జి శ్రీ టి. సంబంధంగారీ కింది ప్రకటన చేయుచున్నారు.

శ్రీమతి రామహాలక్ష్మమ్మగారు ప్రవేశపెట్టనున్న "బోగంమేళం నిషేధబిల్లు" ను నేను పూర్తిగా బలపరచుచున్నాను. ఈ బిల్లు ఆంధ్రదేశమునకే గాక తమిళదేశమునకు గూడ ఉపకారము చేయగలదని విశ్వసిస్తున్నాను.

దీనివలన నాట్యకళకు విఘ్నము వాటిల్లునని అనుకొనుటకు ఏ మాత్రము అవకాశం లేదు. కాగా బిల్లులో కొన్ని చేసినయెడల ఆకళ యింకా అభివృద్ధి అగుటయేగాక, పంసాక స్త్రీలు నాట్యకళను అభ్యసించి ప్రదర్శనములో నటుటకు వీలుకలుగును.

# మదరాసు ధరలు

మదరాసు, సెప్టెంబరు 22:

వేరుసెనగ: (531 పా 1-కి ఎస్సు కోస్తా గిడ్డంగులు) మెషిన్ (సేల్సుటాక్సుతో సహా) పప్పు బజారు 188-0-0.

ఇంగ్లీషుకాండి (500 పౌనుల గలది) 1-కి ఆఫీసు 148-0-0,

వేరుసెనగనూనె: ఎక్సుపెల్లర్ (సేల్సుటాక్సుతో సహా)

మదరాసు, బజారు వెల 300-0-0.

ఆముదం మిల్ డెలివరి ఎక్సుపెల్లర్ పర్ ఇంగ్లీషుకాండి 500 పౌనులు గలది రు. 840.

కొంకాయనూనె (89 పౌను గల డబ్బా) వెల 26-8-0.

### పంచదార

2 అందరు "పాస్ పేట" రూ. 65-13-2

బంగారు-వెండి: నేటి మధ్యాహ్నం 1 గంటకు సవరను 1-కి ఎడ్వర్డు బొమ్మ వెల 74-2-0 పెట్లాబంగారు తులం 110-6-0 మాసబంగారు 108-12-0, సీమ వెండి తులం 100-కి (రెడీ) 168 0-0 తులం వెండి 1-కి 1-11-6.

### నూలుధరలు

గిడ్డంగులవద్ద ధరలు- మద్రాసుమార్కెటు చిల్లర:

10½ గ్రే. రు. 8-14-0, 20 గ్రే రు. 12-1-0, 28 గ్రే రు. 15-6-0, 30 గ్రే రు. 15-10-0 32 గ్రే 15-14-0 40 గ్రే రు. 17-14-0, 60 గ్రే 18-4-0, 80 గ్రే రు. 24-4-0, 100 గ్రే రు. 31-12-0 (రైల్వేరవాణా, తదితర ఖర్చులులేక.)

### నోటీసు

స్మాల్ కాజ్ కోర్టు, మద్రాసు.

సూట్ నెం. 2887 ఆఫ్ 1947.

వాది: జి. పార్థసారధి మొదలియారు.

ప్రతివాదులు: ఎస్. మాధవచెట్టి, ఎస్. కామాక్షి అమ్మాళ్, దేశెట్టిగ్రామము, శ్రీహరికోట పోస్టు, సూళ్లూరుపేట తాలూకా, నెల్లూరు జిల్లా.

ఇందుమూలముగా తెలియజేయున దేమనగా: 27-7-1944 తేదీన రు 170/- లకు వ్రాయబడిన ప్రామిసరినోటు తాలూకు బాకీ ఖర్చులతో సహా రు 186/-లకు వేయబడిన పై దావా 26-9-1947 తేదీ ఫ్యూనీ జడ్జిగారి యెదుట విచారణకు వాయిదా వేయబడినది. ఆ నాటికి మీరు హాజరుగానియెడల దావా మీ పరోక్షమందు తీర్మానింపబడును.

సి. ఆర్. రాజగోపాలాచారి,
వాదితరఫు అడ్వొకేటు.

17-9-47. మద్రాసు.

